శిల్పవేదము జీర్ణింపఁ జేసికొన్న
నిస్తుల ప్రతిభా మహనీయులైన
సూత్రకారులు కొందఱా స్తూప శిల్ప
ఖండములు చెక్క నడుములు గట్టి రపుడు.

శ్లో॥ సచ్చిదానందరూపాయ
జగదంకుర హేతవే
సదోదితాయ నిత్యాయ
నమ శ్శ్రీ విశ్వకర్మణే.

విశ్వశిల్పమునకు విభుఁడయ్యె నే దేవుఁ
డాది శిల్పి నా కళాధినేత
విశ్వకర్మ వేదవిధి నిట్లు ధ్యానించి
పూనుకొనిరి స్తూపమును రచింప.

# స్తూప శ్రీ

—o—

మూఁడు వందల యేడు లమోఘ తపము
చేసి సృష్టించి రీ స్తూప శిల్ప కృతుల
సిద్ధహస్తులు మన తెల్గు శిల్పి వరులు
తమ కళాశక్తు లన్నియు ధారవోసి.

చైత్యక సంప్రదాయ మిట స్థాపితమైన కతమ్మున న్మహా
చైత్య మటంచు నీయది ప్రశస్తి వహించి మహాంధ్ర సాంఘిక
స్తుత్య పవిత్ర పీఠమయి సొంపెస లారిన దా ధరాధిపా
దిత్యుల పాలనంబున నతిప్రతిభా కృత శిల్పకావ్యమై.

అద్ది కారుణ్యమూర్తి బుద్ధాంఘ్రి దివ్య
పూజ కెత్తిన రత్న నీరాజనమ్ము;
అది జగచ్ఛాంతిదూత దివ్యావతారు
నర్చనము సేయు శిల్ప పుష్పాంజలి పుటి !

ఈ చలువతాల ఖండాల నెన్ని రసము
లూరినవి, ఎన్ని కథలు రూపొందినవి, మ
రెన్ని జగములు కళల సృష్టింపఁబడిన
వహహ ! యీ యాకృతీశ్వరు లంటుకతన.

ఏ యమృతక్షణమ్ముల సృజించిరొ శిల్పికులీను లీ జగ
ద్గేయములైన శిల్పములఁ దెల్గుకళాప్రతిభల్ చరిత్రలో
మాయని కీర్తి వెల్గినవి మంజుతరాంధ్ర విశిష్ట శైలికిన్
మా యమరావతీకళకు మంగళగీతము పాడె లోకముల్.

సృష్టించి రిట శాక్యసింహ స్వరూపంబు
కరుణారసము పొంగి కాల్వ గట్ట
కల్పించి రిట యక్ష కామినీమణులను
భువనసౌందర్యంబు ప్రోవు పడఁగ
శిల్పించి రిట బుద్ధ జీవిత చరితముల్
శీల సంస్కారముల్ చిగురు వెట్ట
చెక్కినా రిచట విచిత్ర జంతువులను
స్వాంత ముప్పొంగి హర్షమునఁ దేల
సృజన యొనరించి రిచట నచ్చెరువు గదుర
నాంధ్ర సంస్కృతి నంత మహత్తరముగ
తెలి మెఱుంగుల నెలతాల ఫలకములను
ఘనములు మెచ్చఁ దమ కళాద్భుత చరిత్ర.

నలువురు శిల్పిబ్రహ్మలు
నిలువెల్లం ధారవోసి నిర్మించిరఁటే
లలితమగు బుద్ధసభ నొక
కళా నిధానంబుగా నఖండిత శక్తిన్.

మన ముప్పొంగ నుపన్యసించెడు నహింసాధర్మసిద్ధాంతి బో
ధనముల్ వీనుల విందుగా వినుచుఁ జిత్రప్రక్రియం బొల్చు న
మ్మనుజవ్రాతపుఁ దన్మయత్వ మెటు నిర్మాణించెరా శిల్పి! యా
తని కెంగేలికిఁ జల్వఱాయి నవనీత ప్రాయమై పోయెనో!

"సూచీ శిల్పము" లందుఁ జెక్కిరి జనస్తుత్యంబులౌ నేన్గులన్
ప్రాచీనాంధ్ర జనాళి వైఖరులఁ దెల్పంజాలు మేల్మూర్తులన్
వాచాతీత మనోజ్ఞ పద్మముల శుంభ ద్దివ్య శిల్పైక వి
ద్యాచాతుర్యము ఖండఖండముల జోహార్లంది వెల్గొందగన్.

"ఊర్ధ్వపటము"ల యందు మహోజ్జ్వలముగ
నాట్య వేదము శిల్పించినారు చూవె!
బౌద్ధ జాతక కథల విస్పష్టముగను
నడిమి ఫలకమ్ములోఁ దీర్చినారు సుమ్ము.

చైత్యశిలా ఫలకంబుల
నత్యద్భుత శిల్పరేఖ హావణించి మహా
చైత్యములఁ దీర్చి పెట్టిరి
చైత్య ప్రతికృతులనంగఁ జాలెడు రీతిన్.

అదిగో! బుద్ధుని ధర్మచక్ర మొక స్తంభాగ్రంబునం జెక్కఁబ
డ్డది; లోకాద్భుత దివ్య శిల్పకళ నాట్యంబాడు నాకంబమం;
దదియే చాలు పురాంధ్రశిల్పి విజయాహంకార గాథావళుల్
గొద లేకుండ వచింపఁ దద్యశము దిగ్వ్యూహంబుల న్నింపగన్.

అందుఁ జెక్కిన గుప్తాలయందుఁ దెల్గు
జోడు కొయ్యారముగను గూర్చుండి యాంధ్ర
నాగరికతను నీ నేల నాల్గు చెఱగు
లంపు నింపంగఁ బోవుచున్నట్లు దోఁచు.

అపరబుద్ధుఁ డనంగఁ బే రంది నట్టి
యార్యనాగార్జునుండు శిల్పాగ్రయాయి
కల్పనము చేసె నంట ప్రాకారరేఖ
భువన సౌందర్య మిట నచ్చు వోసినట్లు!

వేద వేదాంత శాస్త్రాది విధుల నాత్మ
స్వాత్మములఁ జేసికొన్న శిల్పప్రభుండు
తన కళాక్షేత్రమందు నధ్యాత్మ సత్య
మర్మముల నెంత మేలఁకువన్ మలచినాఁడు!

'ఆయకకంబము' ల్మాఁబనట్టి తెఱంగు తెలుంగుశిల్పమం
దే యగపడ్డ దీ తెలుఁగుదేశపు శిల్పి స్వ సంప్రదాయమున్
దాయక సృష్టిహేతువులఁ బంచవిధాదిమ శక్తులన్ జగద్
ధ్యేయులఁ బంచమూర్తులను దీరిచి చూపెను వీని రూపునన్.

ఆది మై కైక తత్త్వమునం దభిన్న
ములుగ నెలకొని భువన లీలల పెలార్చు
పంచ శక్తుల నే మత పక్షమందు
నన్వయింపంగఁ జాల రధ్యాత్మవిదులు ;

ధర్మచక్ర ప్రవర్తనా ద్యంబులైన
పంచ కల్యాణములను సూచించు వాంఛ
సైత మున్నది యా నాఁటి స్థపతి మణికి
నార్యక స్తంభ నిర్మాణమందుఁ జూడ

బుద్ధుఁడును, ధర్మమును, సంఘమును ననంగఁ
నలరెడు త్రిరత్నములకుఁ దా నా త్రిశూల
చిహ్నమును జెక్కి యల పరశివుని బుద్ధు
నొక్క సూత్రములో గ్రుచ్చె నోయి శిల్పి.

బుద్ధోదయమున కద్భుత చిహ్నములు గాఁగఁ
బద్మచిత్రమ్ములఁ బాదుకొల్పి
అద్వయవాది మహాభినిష్క్రమణంబు
తలఁపించు వారువమ్ములను మలచి
మారజయంబు నుదార బుద్ధత్వాప్తి
స్మరియింప బోధివృక్షములు చెక్కి
సౌగత ధర్మ ప్రచారంబు సూచించు
ధర్మచక్రముల విస్తరము తీర్చి

ఆ మహాపరినిర్వాణ మాత్మ వెలయ
స్తూపరూప శతమ్ములఁ దొలిచి పెట్టి
శాక్యసింహాని జీవిత సార మెల్ల
వ్రాసినా రీ శిలామయ గ్రంథమందు.

కామకల్పిత సంసారకంధి దాఁటి
జీవితమ్మున బుద్ధిత్వసిద్ధఁ గాంచు
గెలుపునకు సూచకంబుగా మలచినారు
చైత్యమున రమ్యతర సింహ సముదయంబు.

హైందవ శిల్పికిన్ సహజమౌ రసభావ మనోజ్ఞ చిత్రణం
బిందలి మూర్తులన్నిట సమృద్ధి వహించెను; బాహిరాకృతుల్
చిందిన వందచందము లశేష జగంబులు నాంధ్రశిల్పి సం
క్రందను చాతురీమహిమ గాంచి యొనర్ప చిరప్రశంసలన్.

ఇవిగో ! బుద్ధుని దివ్యపాదములు గంటే శూలచక్రాది ల
క్ష్మవిలాసోజ్జ్వలముల్ దురంత భవదుఃఖ ధ్వంసకంబుల్ సదా
భువనారాధ్యము లెట్లు శిల్పి ప్రతిభాపూర్వక్రియా సృష్టి వై
భవ చాతుర్యము రూప మెత్తినటులే భావించి కల్పించెనో!

గౌతమమునీంద్రు శ్రీపాద కమలముద్ర
లెచట హత్తిన నట జగ దీడ్యము లగు
స్వర్గములు సృష్టి కాలేదె జనతయందు
నిత్య నిర్వాణ పథము రాణింప లేదె !

ఈ మహనీయపాదముల కెందఱు మ్రొక్కులు వెట్టి జన్మదో
షామయ శూన్యులైరొ, మహిమాఢ్యము భూతదయావ్రతమ్మనే
భూములఁ బండఁజేసి యివి పుణ్యయుగమ్ముల సృష్టిచేసెనో
యేమరకుండ వీని మది నెంచి ఘటింపుఁ డనశ్వరాంజలుల్.

దివ్యతమ శిల్పముల నిట్లు తీర్చి దిద్ది
ఆత్మనామంబు చెక్కుకోనట్టి శిల్పు
లెంతవైరాగ్యపరులో! మఱెంత కీర్తి
కామనాదూరులో! శివంకర ధిషణులో!

ఆర్యకస్తంభాల యందచందములలో
లతలు పూవులు సింహతతులు చూచి
అందచిత్రముల దివ్యాకారములలోని
మూర్తుల యింపు సొంపులకు మెచ్చి
ప్రాకారరేఖపై లోకాద్భుతపు శిల్ప
చాతుర్యమున కాత్మ సంతసించి
ఉష్ణీష శిల్పాల నొప్పు సముజ్జ్వల
సౌందర్యమునకు నాశ్చర్య మంది
ఆయధిష్ఠాన చిత్రములందు నూర్ధ్వ
పటములందలి దివ్యశిల్పముల కబ్బి
త్రిజగముల నేలఁజాలు మా తెలుఁగుశిల్పి
మహిత నిర్మాణ కళకు నమస్కరింతు.

నా కవిత చాలదోయి, సుందరము లయిన
నీ రచించిన శిల్ప ఖండికల నెన్న;
భావనావీథిఁ దలఁపులు ప్రాఁకులాడి
మాయమై పోవుఁ గడకే సమాధియందొ!

శాశ్వత కళాధనంబు దేశమున కొసఁగి
అనుపమత్యాగ మొనరించి యరిగినట్టి
కీర్తిసన్న్యాసివగు నీదు కృతులు కతలు
మానవాదర్శములు విశ్వమాన్యములును.

ధనకటక దివ్యశిల్ప సౌందర్యలక్ష్మి
ముగ్ధ మొనరించుటను జగమ్ముల మనమ్ము
అన్యదేశీయు లాయమ్మ కంజలించి
సంప్రతిష్ఠించుకొన్నారు స్వస్థలముల!

# వైభవము

—o—

బుద్ధదేవుని శ్రీపాదములకు నెరగి
ఆర్యక స్తంభ శోభల నభినుతించి
ధర్మచక్ర ప్రసిద్ధ సౌందర్య మెంచి
వర్ణన మొనర్తు మన పురావైభవమ్ము.

ఈ మహాదుర్గంబు నెటుల నిర్మించిరో
శాత్రవానీక దుస్సాధముగను
ఈ నృప ప్రాసాద మెటు సృష్టి చేసిరో
శిల్పదేవత దృఢాసీన గాఁగ
ఈ సౌధ విధముల నెట్లు కల్పించిరో
వాస్తు సంపద కాటపట్లు గాఁగ
ఈ వీథివిన్యాస మెట్టు లూహించిరో
పురలక్ష్మి క్రొత్త సొంపులు వహింప

ఈ మనోజ్ఞాపణంబుల నెట్లు తీర్చి
కట్టిరో క్రొత్తచెలువము లుట్టిపడఁగ
ఈ పురోద్యానవాటుల నెట్లు తీర్పఁ
గల్గినారలో వింత సింగార మొలుక.

గోపుర ద్వార తోరణ కుడ్యతతుల
శిల్ప విన్యాస రీతు లచ్చెరువు గొల్పి
ధాన్యకటక పురీంద్ర సౌందర్య లక్ష్మి
విభ్రమ విలాసములఁ జెప్పు వేవిధములఁ

అట బౌద్ధసన్న్యాసు లాదరించు ననాథ
 జాలు రుండిన శరణాలయములు
అట హోమకుండాల కాహుతి గాఁబోవు
 పశువుల రక్షించు భవన సమితి
అటఁ త్రిరత్నముల సంధ్యావేళ బోధించు
 కారుణ్య నిధుల దీక్షాగృహములు
అట నహింసాధర్మ మాద్యంత మెఱిఁగింప
 వెలయు నుపన్యాస వేదికలును
అచట నష్టాంగయోగంబు నభ్యసింపఁ
దీర్చి కట్టిన మహనీయ దివ్యశాల
లరసి యాంధ్రుల భోగభాగ్యముల కెడఁద
ముదముపడ నెంతొ పొంగిపోయెదము మేము.

ఒక తెలుఁగుంజగమ్మున కటోయి, దిశాఖిల దేశ దేశముల్
ప్రకటముగాఁగ గర్వపడు భంగిఁ జెలంగిన ధాన్యవాటి రాట్-
శకము సమస్త శాంతి సుఖ సంపదల న్వెలయించి నూత్నజీ
విక వెలిగింపలేదె; నవ విశ్వము సృష్టి యొనర్పదే ధరన్।

తన బౌద్ధగురుని మతవ్రత దీక్షగా
సింహాళంబున స్తూపచిహ్న ముంచి
తన సర్వశిల్ప విద్యానిదర్శనముగా
"దాపంగు" విశ్వవిద్యాలయ మిడి
తన యహింసకు మేలి తార్కాణగాఁ బ్రాణి
వితతికిఁ గారుణ్య భిక్ష పెట్టి
తన కళారాధన కెనలేని ఫలముగా
జగమెన్ను స్తూపరాజంబు గట్టి
తనదు బౌద్ధధర్మ తత్పరతకును దృ
ష్టాంతములుగ మే ల్విహారములను
బెక్కు వెలయఁజేసి పేరుగన్న దమరా
వతి మహోజ్జ్వలాంధ్ర పత్తనంబు ,

ఆ పూట కింట బియ్యము లేని నిరుపేద,
కవులపైఁ గురిసె బంగారువాన
అతిలోక సృజనా కళా రాధకుల చేయి
సృష్టించె శిల్ప విశిష్ట జగము
పరులగుండెలు తీయు బంగ్లైన తెల్గు జో
దుల బాకులు దిగంతముల వెలింగె
కులభేదములను ముక్కలుగాఁగఁ జీలిన
మానవు లేకసమాజ మైరి

# అ మ రా వ తి

ఆద్యు లైన మనుజు లాదిగా వీథిలోఁ
బేడ ప్రోవు చేయు పిల్లదాఁక
చదువు నీతి గలిగి చదురులై వెల్గిరా
బౌద్ధ భూమిపతుల పాలనమున.

పొట్టకుఁ గూడు కట్టుటకుఁ బుట్టము గానని పేదవారు లే
నట్టి జగమ్ము నెట్లు సుగతాంధ్రులు సృష్టి యొనర్చినారలో!
యెట్టుల నీ చరాచరము లెల్ల సుఖంపడ బద్ధదీక్షులై
కట్టిరొ శాంతితోరణ లఖండ పరోపకృతి ప్రవీణులై!

ఇట శిలాశిల్పమే కాక యెల్ల కళలు
నాంధ్ర నాగరికత వెల్గు లతిశయింప
వెల్లివిరిసిన వా పూర్వ వేళలందు
నాంధ్ర శిల్పుల చాకచక్యంబుకతన.

పంచవిధ శిల్పముల దేశభాగ్యమునకు
సాధనముగా నొనర్చి యైశ్వర్య లక్ష్మి
సంతరించుట కా నాఁటి స్థపతి వరులు
వెదక కున్నట్టి దొక చిన్న వృత్తి లేదు.

ఆ కృష్ణాతటినీ తరంగముల నొయ్యారంబుగా నాడు మా
నౌకాశ్రేణులు తెల్గు వర్తకుల విన్నాణంబు సూచించెడిన్;
నైకాశ్చర్య మనోజ్ఞ వస్తుయుత నానా కర్మశాలావళుల్
మా కర్మారుల హస్తనైపుణిని దార్కాణించు వే రీతులన్.

అపుడు లే రాంధ్రత్వ మగ్గిఁ గాల్చి విదేశ
　　　రీతుల మెచ్చి వరించువార
లపుడు లే రాత్మార్థమయి లోకమును బలి
　　　గొనునట్టి నిష్ఠుర క్రూరకర్మ
లపుడు లే రాత్మధర్మాపేతులై యవి
　　　నీతితెర్వులఁ బయనించువార
లపుడు లే రాంధ్ర దేశారాధనము వీడి
　　　పరుల పంచలు సేరి బ్రతుకువార
లపుడు లే రెన్నిచూచిన నంధ్రమందు
నాంధ్రజాతీయతా దూరులైన మనుజు
లప్పు డాంధ్రత్వ మగ్గలమై జగమ్ము
నేలినది సుమ్ము తనధాటి కెదురులేక ।

లోక కల్యాణ ఘటనా విలోలబుద్ధి
బుద్ధదేవునివలె త్యాగమును బొనర్చి
జీవితము సార్థకంబుగాఁ జేసికొన్న
మనుజు లగ్గల మా నాఁటి తెనుఁగుజగతి.

విశ్వహితంబుపొంటె నతివేల సుఖంబులు భోగభాగ్యముల్
నశ్వర జీవితంబులు తృణంబుగ త్యాగమొనర్చి సేవయే
శాశ్వత శాంతిమార్గమని సంతత భూతహితానుసారులై
యీశ్వరతృప్తికై బ్రతికి యేఁగిరి తెల్గులు బౌద్ధభూమిపై.

శాతవాహన ధరానేత శ్రీముఖుఁ డాత
డందు సామంతోపహారములను,
హాలుని గొలుచు గుణాఢ్యుఁడాతఁడు బృహ
త్కథ సృష్టిసేయు ప్రాగ్గాథ లేర్చి,
భావ వివేక తాపస గురుండాతఁ డ
ద్భుత వజ్రధారణి స్నుతి యొనర్చు,
తాంత్రిక బౌద్ధ విద్యా పారగులు వారు
జపియింతు రే మంత్ర సముదయంబొ
అదె మహాయాన బౌద్ధశాఖానుయాయు
లచట చర్చింత్రు హీనయానార్య సమితిఁ
గలసి బుద్ధుని తొంటి విజ్ఞాన రీతు
లహహ! యివి యెంత చారుదృశ్యంబులోయి!

క్షత్రపాన్వయు నహపాన చక్రవర్తి
సైన్య సహితమ్ముగాఁ దున్మి శాతకర్ణి
ఆంధ్రసామ్రాజ్యమును దిక్కులంటఁ బెంచి
తెలుఁగు జెండాలు కడల నర్తింపఁ జేసె

ఈ తెలుగుంబొలాల ఫలియించిన సంస్కృతి సస్యసంపదల్
భూతల మెల్ల నిండినవి పో, మన భారత ధర్మ కేతన
స్ఫీతరుచుల్ ప్రజాహృదయ సీమల నాంధ్యము చిమ్మి శాంతి వి
ద్యోతిల నేల నేలిన మహోజ్జ్వల చిహ్నము లున్న వెన్నియో.

సింహళద్వీప ప్రసిద్ధ శిల్పంబులో
అమరావతీ రీతి హత్తుకొనియె
చీనా జపాను విజ్ఞాన కాంతులలోన
తెలుఁగు తళ తళల్ తేజరిల్లు
జావా సుమిత్రాది దీవులలో మన
తోలు బొమ్మల వినోదాలు వెలఁగు
కాంబోడియా ప్రముఖమ్ముల హైందవ
మత సంస్కృతులు సువిస్తృతము లయ్యె
చెంగటగ నున్న దీవులఁ జెప్ప నేల!
"అమెరికా" యందె మనశిల్ప మడుగు వెట్టె;
ఆసియా జ్యోతి వెల్గి లోకాద్భుతముగ
మర్త్యజగమున చీఁకటి మాంద్య మణఁచె.

దక్షిణాపథమునకుఁ బ్రధాన బౌద్ధ
పీఠ మీ యమరావతి విస్తరించె
నవని నెల్లెడ బౌద్ధ విహారములను
నద్భుతములగు శిల్ప విన్యాసములను.

అపుడు గణనీయముగ చేయుంచు జరుగు
బౌద్ధ సంగీతులం దాంధ్ర పండితాళి
వాదధోరణి ప్రతివాది వాయి కట్టి
గెలుపుగొన్న చరిత్రలు కలవఁటన్నొ!

సింహళద్వీపమున మున్ను సృష్టిచేయు
స్తూప సందర్భమునకు భిక్షు వ్రజంబు
నాల్గు లక్షల "పైచిల్కు" నడచినార
లాంధ్రదేశమునుండి నాఁ డబ్బురముగ.

తెలుఁగువారపు డా మహాదేవభిక్షు
నాధిపత్యముతో ననూరాధపురము
వాడవాడలఁ "గిటకిట లాడఁ" జూచి
పొరుగుదేశము లెంత మచ్చరము గొనెనొ!

అప్పుడు వీరి మూలమున నాంధ్రుల నాగరికత్వ సంపదల్
కుప్పలుగాఁగ సింహళములో దిగెనందురు; తెల్గుశిల్పపుం
జొప్పులె కానుపించు నట స్తూపమునందున బుద్ధమూర్తిలోఁ
జెప్పెడిదేమి తెల్గు పస చేరెనుఁ రా! చిఱు దీవులందునన్.

ఆప స్తంబ మహాతపస్వి నిగమ వ్యాఖ్యా ప్రశస్తోరు వి
ద్యాపాండిత్య మహాప్రగల్భు డిట సూత్రగ్రంథముల్ వ్రాసి తా
నాపాదించె ననంత కీర్తులు త్రిలింగైశ్వర్య సంఘాత యై;
యా పుణ్యర్షి చరిత్ర మాంధ్రులకు సంధ్యామంత్రపూతమ్మగున్.

## శా లి వా హ నుఁ డు

ఇచ్చట శాలివాహన కవీంద్రుఁడు ప్రాకృతభాషలో కవుల్
మెచ్చెడు తీయ తీయనగు మేలిమి గాథల నేడు నూర్లు వా
క్రుచ్చి సరస్వతీ రుచిర రూపము తీరిచి దిద్దె నంట; యా
సచ్చరితాగ్రగణ్యు నుతి సల్పరె యాంధ్రులు నేఁటి కేనియున్!

ఆంధ్రుల సేవగా రస మహత్తర మంజుల కావ్యగాథ లీ
యాంధ్ర నృపుండు ప్రాకృతము నందొడఁగూర్చి మనోజ్ఞభావ సీ
రంధ్ర నొనర్చి దాని, నతిరమ్య యశోనవ చంద్రకాంతిలో
నాంధ్రము ముంచియెత్తె నహహా! పులకింపఁగ మేను సోదరా!

జుమ్మని తేఁటులు మూఁగెనొ,
గమ్మని వాగ్దేవి గజ్జె కదలించెనొ, మా
కుమ్మరి దొరగా రిమ్మహి
కమ్మని గాథామధూళిఁ గార్చెడు వేళన్.

రెండు వేలేండ్ల నాఁడె మా తేఁడు మధుర
మధుర నవ సాహితీ రుచు ల్మల్లడింప
విశ్వమోహన గాథలు వెలయఁజేసె
నన్న కీరితి నీదెగా యాంధ్రపుత్ర !

నూఁగుమీసాల ప్రాయమందున తలంపు
లుజ్జ్వలములై గుబాళించు చున్న యపుడు
శాలివాహను నీ "సప్తశతి ని" నొడివె
నాంధ్రమునయందు శ్రీనాథుఁ డద్భుతముగ.

ఆ కవిసార్వభౌముఁడు రసాంచితశైలిఁ దెలుంగు సేయఁగా
నా కృతిరత్న మాంధ్రుల మహాదురదృష్టము హేతువైన నా
త్మాకృతి గోలుపోయినదియా! అది యుండెనె శాలివాహన
శ్రీకవి సచ్చరిత్రమును జెప్పెడి దేమొ రవంతయేనియున్!

శకము నిలఁబెట్టి మన యాంధ్రజాతి యశము
వసుధ నింపిన యొక చక్రవర్తి యతఁడు!
ఆతని మనసారఁ బూజించి యతనిమహిమఁ
గొలువఁ జాలని పటు కృతఘ్నులము మనము.

కమ్మని వంగడమ్ము వెలుఁగుల్ వెలయింపఁగఁ బుట్టి, యాంధ్రరా
జ్యమ్మున కేలికై మధురసాహితి మన్నన సేయు విజ్ఞుఁడై
కమ్మని గాథ లల్లిన యఖండ కళారసమూర్తి కాంధ్ర దే
శమ్ము రచింపదే రస వశంవదమై రుచిరాక్షరాంజలుల్!

## నా గా ర్జు నుఁ డు

అతఁడు నాగార్జునాచార్యుఁ డతులశక్తి
సిద్ధులను గాంచి యోగవిశిష్టుఁ డగుచు
అట్టి నాగార్జు నాఖ్య నలరు మేటి
గద మహాయాన బౌద్ధ శాఖా ప్రణేత!

ఏ మహా తాపసోత్తంసుఁ డిరవు కొనుటఁ
గనెనొ "నాగార్జునునికొండ" యనెడు పేరు
శ్రీగిరీంద్ర, మతండు ప్రసిద్ధ శిల్ప
చాతురీ ధూర్వహుఁడు బౌద్ధ చక్రవర్తి.

బుద్ధ గుణశీలముల నత్యపూర్వ ఫణితి
మధురముగ వర్ణన మొనర్చి మాన్యుఁ డీతఁ
డంపినాఁడు "సుహృల్లేఖ" యనెడు పేర
నాంధ్రరాజగు శాతవాహనుని కడకు.

ఆ లేఖాంశము లెంతపూజ్యములో నాఁడా యాంధ్రరాజేంద్రుఁడు
ద్వేలానందము సందడింపఁగఁ దదాదేశంబు పూదండఁగా
మౌళిం దాలిచి బౌద్ధ ధర్మముల సన్మానించి బంగారపుం
బూలం బూజలు చేసె చైత్య మనిదంపూర్వాభిరామంబుగన్.

అతని పవిత్ర సేవల కుదాహరణంబులు తెల్గుగడ్డపై
స్థితిఁ గనినట్టి చైత్యములు శిల్పవిచిత్రములుం గళాలయా
ద్భుత మహనీయసృష్టులు నపూర్వము లార్హత దర్శనంబులున్
జతుర వినూత్న వైద్యవిధ చర్యలు జీవన సౌఖ్య హేతువుల్.

అతని నాగార్జునునికొండ యభ్యుదయము
నాదిశంకర గురుమూర్తి యణఁచి వైచె
వికృత బౌద్ధము ఖండించి వేసి వేద
ధర్మసంస్థాపనము సేయు తరుణమందు.

ఈ నాగార్జునభారతీయముని యే యే సత్కృతుల్ వ్రాసి వి
జ్ఞానంబున్ వెదచల్లె లోకమున నా సద్గ్రంథముల్ శ్రీహరీ!
యేనాఁడో చనె నగ్నిసాత్కృతముగా నివ్వేళ నవ్వాని నే
చైనాయందొ తిబెత్తునందొ కని హస్తంబందరే హైందవుల్.

బౌద్ధమత సంస్కృతికి భక్తి స్వాగతంబు
పలుకుటంజేసి ప్రాకృత వాఙ్మయంబు
హైందవోదగ్ర కోపానలార్చి మ్రగ్గి
స్వస్వరూపముతోడఁ గన్పడదు నేఁడు.

## వి శ్వ వి ద్యా ల య ము

అదిగో! పూర్వాంధ్ర విశ్వవిద్యాలయమ్ము
శారదాదేవి రమ్య విహారశాల,
కళల కాణాచి, చదువులఁ గన్నతల్లి;
అరయు మొకపరి స్మృతినేత్ర మట్టె విప్పి.

ఈ కళాపరిషత్తు మున్నెన్ని యెన్ని
దేశముల కాత్మవిద్యోపదేష్ట యగుచుఁ
దెలుఁగు వెలుఁగులు దిక్కుల నిలిపినదియొ
అరసిరే యెన్నడైన మా యాంధ్రజనులు?

ఇట గజ్జె గట్టి శారద
నటనము సల్పిన దఁటా దినంబులయందు
త్కటమయి శిల్పశ్రీ వి
స్ఫుటకీర్తులు దెసల క్రమముగఁ బ్రాఁకె నఁటే!

ఆ కరుణాతపస్వి హృదయమ్ము ద్రవించి జగద్విముక్తి ల
క్ష్యకము లెట్టి శాస్త్రములు సృష్టము లైనవొ, వాని బౌద్ధ వి
ద్యాకృతు లైనపండితు లహర్పతితేజు లుపన్యసించు నా
యా కమనీయ దృశ్యముల నాత్మ సుఖంపడఁ జూడు నెచ్చెలీ!

పదిపదివేల శిష్యు లిట నెప్పుడుఁ బాయక శాస్త్రముల్ కళల్
మనన మొనర్తు రంట! మతిమంతులు గీష్పతులట్టి దేశికా
గ్రణులు శతాధికంబుగ నిరంతరచర్చలఁ బుచ్చువారఁటే!
ఘనులగు శిల్పులున్ గవులు క్రమకళార్చన సేయువారఁటే!

అదె విశ్వవిద్యాలయ ప్రవేశద్వార
మతిలోక శిల్పాల కాటపట్టు ।
ఇదె పట్టభద్రుల కెలమిమై యోగ్యతా
పత్రమ్ము లందించు భవ్య భవన ।
మదె శిష్యతతికి శాస్త్రార్థముల్ బోధించు
రక రకమ్ముల హర్మ్య రాజ రాజి ।
అవిగొ దేశాంతరాయాత విద్యార్థుల
వసతికౌ ఘనసౌధ వాటికలును।
అవె మహోత్కృష్ట శిల్పకళాలయంబు ।
లవ్వి కార్యాలయంబు, లియ్యది మనోజ్ఞ
ఘనతరాద్భుత పుస్తకాగార సమితి।
సర్వ వస్తు ప్రదర్శన శాల లివ్వి ।

అల 'టిబెట్టు'న నిర్మితమై తనర్చు
నట్టి "దాపంగు" విశ్వవిద్యాలయంబు
దీని నాదర్శముగఁ గొని తీర్చి రంచె
యాంధ్రుల గురుత్వమునకు చిహ్నంబు గాఁగ :

మఱల మా భారతీదేవి మధుర మధుర
మంజు నూపుర నిక్వాణ మహిమ వినమొ ।
ప్రాక్కళాయోగ విజయ గర్వము తెలుంగు
వీర సంతతి హృదయాల వెలయఁ గనమొ ।

# బుద్ధ జయంతి

ప్రతివసంతమ్ము వైశాఖ పర్వములను
బుద్ధుని జయంతులందు సబ్బురము గదుర
వాడవాడలు కళకళ లాడి పోవు
ధర్మధర్మోత్సవమ్ము పొడగాంచు పాఠకుండ!

ఈ పవిత్ర దినంబుననే ప్రభుండు
'ధర్మచక్రము' నా మృగదావమందు
త్రిప్పినాడట! యా పుణ్యదివస మెన్ని
పూజలకు నోచుకొనదు భూభువనమందు!

ధర్మచక్రంబు నద్వయద్రష్ట త్రిప్ప
ప్రజల భాగ్యమ్ము క్రొంగ్రొత్తబాటc దిరిగె,
జనతలో హెచ్చు లొచ్చులు సమసిపోయె,
సంఘమున నేరికి నవజ్ఞ జరుగదయ్యె!

సదస దన్యమైన పదమును జేరంగ
దుఃఖమారమైన త్రోవ నడువ
సర్వు లంద నిత్య నిర్వాణ సంసిద్ధి
*ధర్మచక్ర మొకటె తానకంబు!

ద్వీప ద్వీపాంతర గత
భూపాలురc బ్రజల బుద్ధ బోధసుధా పా
నాపాన తృష్ణ లగుటకు
ఈపూర్ణిమ పిలుపునందు నేడేటc దమిన్.

* బౌద్ధధర్మ మొకటె ప్రాతిపదిక.

వారు చీనాదేశ వాసులౌ భిక్షువుల్
పూజించుచున్నారు బుద్ధదేవు
వారలు సింహళప్రజలు వెల్గింతురు
దీప వితానముల్ స్తూపమందు
వారు త్రివిష్టపావాస విద్యార్థులు
పఠియింతు రట "ధమ్మపదము" భక్తి
వారు జావాద్వీపవాసులు త్రిపటక
ధర్మ నిర్మల చర్చఁ దవిలినారు
వా రఖండులు సు మ్మాంధ్ర బౌద్ధగురు లు
పన్యసింతురు ప్రబల విపక్ష పక్ష
ఖండనోదగ్ర చాతురీ గరిమ సుగత
వితత మతహిత రీతు లద్భుతము గమన :

బుద్ధుని జీవితాంశములు పూసలు గ్రుచ్చినరీతిఁ జెప్పు సం
విద్ధనమైన యా "లలితవిస్తర" కావ్యము నాంధ్రపండితుల్
బుద్ధమతాభిమానులకు బోధ యొనర్చెద రందుఁ గాంచు మా
వృద్ధులు బాలు రంగనలు వింద రట "సద్ధర్మ" పద్ధతుల్.

ఇదె కృష్ణానదిఁ గ్రుంకువెట్టి గుముల్తై యేతెంచు నీ భిక్షువుల్
చదువం జొచ్చిరి బౌద్ధవేదముల; నా చాయక్షా పరివ్రాజికల్
సుదతీలోకముఁ గూర్చి బుద్ధుని మహాసూత్రార్థము ల్విప్పి చె
ప్పుదు రీ సుందరదృశ్యముల్ హృదయ మాపోవంగ భావింపుమా!

—o—

# విషాదము

—o—

అది సుధన్వ నృపాలు సభాంగణంబు
బౌద్ధ వైదిక మతసత్య భంగు లరయ
నుభయ మతములవారు మహోద్ధురు లయి
వాదములు సేయఁబూని రా ప్రభునిమ్రోల.

వైదిక ధర్మమార్గ మనవద్యముగా భువి నిల్పి కీర్తి పం
డాడిన సేయఁబుట్టిన కుమారిలభట్టుఁ డుదగ్ర వైఖరిన్
వాద మొనర్చె వైదికుల పక్షము గైకొని; బౌద్ధపండితుల్
మేమె తర్కవిశారదులు మించిరి బ్రాహ్మణ పండితావళిన్.

ఐదు దినము లట్లు వాదోపవాదములను
జరిపినను సత్య మేదియో తెలియ కునికి
"ఆగమము లప్రమాణము లైనఁ జత్రు,
నవి ప్రమాణంబులేని మే హాసఁ జెంద"

అని యొక పర్వతాగ్రమునయందుననుండి కుమారిలుండు దూకిన, నణుమాత్ర మె గ్గతనికిఁ బొడసూపదు; సభ్యులెల్ల రుఁ జనపతి గూడ మెచ్చి రది: జైనులుమాత్రము మంత్రసిద్ధియో మణుల ప్రభావ మౌనో యనుమానము మాకని మెచ్చకుండినన్.

అవనినాథుఁడు బౌద్ధుల నాగ్రహించి
'చివరి కొక్క పరీక్ష నేఁ జేయువాఁడ,
గెలుచువారల మతముర్వి వెలయు నింక
నోడి పోయిన మూర్ఖుల నుత్తరింతు".

అనుచు శపథ మొనర్చి ఘటాంతరమున
చిలువ నొకదాని నుంచి వాసెన బిగించి
"తెలియఁజెప్పుఁడు మీ బుద్ధిబలము మీఱఁ
గుండలో నున్న వస్తువుఁ గొదుక" కనిన.

విప్రవర్యులు తేపటివేళఁ జెప్ప
ననుమతింపుఁ డటంచు రాజాజ్ఞఁ బొంది,
అంత వఱువాత భాస్కరోపాస్తివలన
బౌద్ధులను గెల్చు తంత్రము వడసి రంత.

బౌద్ధులు కుండలోపలిది పామని పల్కఁ గుమారిలాదు ల
త్యుద్ధతి భోగితల్పుఁడు పయోజదళాక్షుఁడటంచుఁ బల్కరా
పద్ధతి సత్య మాయె నల భాస్కరదేవు ననుగ్రహంబుచే
నిద్ధర శ్రౌతధర్మము మహేశ్వరునాదృతి చూఱలాడఁగన్.

ఘటములో నిద్ర దందశూకంబు మీఁద
శ్రీ రమాభర్త గొలువున్న చెలువు గాంచి
బౌద్ధ విజ్ఞానము నెదందఁ బ్రస్తుతించి
బ్రాహ్మణుల వింతమహిమ కబ్బురపడె నృపుఁడు.

తన యొనరించినట్టి శపథంబు వృథా చనరామి బౌద్ధులన్
జనపతి చంపఁజేసెను దృషన్మయ యంత్ర నిపాతితాంగులన్
బొనరిచి! తేని యానతి మనోరథముల్ ఫలియింప బౌద్ధ నా
శనమున కుబ్బి శ్రౌత మత సంపద నించిరి విప్రు లెల్లెడన్.

ఇట్టి మతవిప్లవాగ్ను లెన్నెన్ని రగిలి
బౌద్ధమును దేశమున బూది పాలొనర్చె
నో" చరిత్రి యెఱుంగు, మహోగ్ర మూర్తి
కాలపూరుషుఁ డెఱుఁగు వే యేల వినుఁడి!

  

ఒక్కతటి దిక్కు లొరసి సముజ్జ్వలించు
బౌద్ధుల విహారవాటి యిప్పట్టణంబు;
ఒక్కతటి సొంపుచెడి గుండె వ్రక్కలించు
శవ నివాసోగ్ర భయద శ్మశాన వాటి.

ఇచ్చోట తొంటి యాంధ్రేశ్వరు ల్వసియించు
సింహాసనములు విచ్ఛిన్నములుగ
ఇచ్చోట తెలుఁగు శిల్పిశానులు సృజించు
దివ్య శిల్పములు విశీర్ణములుగ

ఇచ్చోట నాంధ్ర పూర్ణేందు నిభాస్యల
వింత చెల్వములు దుఃఖాంతములుగ
ఇచ్చోట తెలుఁగుల యిద్ధనాగరికతా
ముద్రాంకములు వినిర్మూలములుగ
ఇచట బౌద్ధ మునీంద్ర మహిష్ఠ ధర్మ
బోధ లన్నియు గాలి కబుర్లు గాఁగ
శాప మిడి నా తెలుంగుల సంపదలను
లయ మొనర్చితి వేమి వేళాతపస్వి!

అది యహింసాదేవు నాకారమా! గండ్ర
గొడ్డళ్ళఁ బగులంగఁ గొట్టినారు,
అవి బౌద్ధకథలు రూపందిన మూర్తులా!
చెవులు ముక్కులు చెక్కి చెఱిచినారు,
అవి బౌద్ధయతుల విహారమందిరములా!
నేలమట్టము చేసి నిలిపినారు,
అవి సౌగతుల పుస్తకాలయశ్రేణులా!
కాల్చి బూడిద నేలఁ గలిపినారు,
అవ్వి వికలాంగులై యేడ్చు ననదవాంధ్ర
శిల్పములె! అక్కటా! నుగ్గు నలిపినారు;
అవి "మహాపథానాలె!" అగడితమున
"పాయిఖానాలు"గా మార్చి వాడినారు.

ఏ క్రూరకాలాన నిట బౌద్ధ వైదిక
మతములు పేర్చి సమ్మర్దపడెనొ,
ఏ దుర్ముహూర్తాన నిట మతద్వేషమ్ము
పాటించెనో రక్త వాహినులను,
ఏ చెడ్డరోజులం దీ సుందరస్తూప
మగలించిరో మారణాయుధముల,
ఏ పాడుప్రొద్దులం దీ రాజధానిచే
అగ్నిహోత్రుఁడు కుత్తు నార్చుకొనెనొ,
ఏ విషమ వేళయందున విచ్చ టాంధ్ర
రాజరాజ కిరీట చిరత్న రత్న
సంతతులు నేల రాలె నా సమయ మెన్న
దారుణక్రూర యమరాజ దంష్ట్రి యేమొ.

ఇచ్చట బౌద్ధజాతి నటీకించిరఁటే మును, సూదు లక్షలం
గ్రుచ్చిరఁటే, శిఖాత్కరము కొంకక కుత్తుక లొత్తినారఁటే,
చిచ్చునఁ గాల్చి చంపిరఁటె చేడియలన్న తలంపు లేకయే,
పిచ్చిమతాభిమాన మెదఁ బేర్చుటచే మన హైందవోత్తముల్.

ఈ రమణీయశిల్పముల నిట్టుల ముక్కలు చేసి యీసు చ
ల్లారఁగ నిండ్లమెట్లుగ, గృహావరణమ్ములఁ గాళ్ళ తొలఁగాఁ
జేరిచిరా కటా ; యెడఁద భిన్నమగుంగద బౌద్ధ సత్కళా
మారణకార్యము ల్దలఁచుమాత్రఁ గఠోర శిలాళి కేనియున్.

బౌద్ధ మతచిహ్న మన్న దే పాటి యున్నఁ
బొడిపొడి యొనర్చి కృష్ణమ్మకడుపులోనఁ
బాఱ వేయక నిద్దుర పట్ట లేదు
నాఁటి సౌగత ధర్మ వినాశకులకు.

మతము బౌద్ధమె యైన సంపదలు తెల్గు
దేశ జననివి కావా, తదీయ సుతులు
సోదరులు కారొ, భేదమ్ము పాదుకొల్పి
తల్లికడుపున చిచ్చిడం దగు నఁటోయి!

హైందవ మతానుచరుల దౌష్ట్యమ్ము కతన
చితికి పోయిన బౌద్ధుల శిల్పలక్ష్మి
ముసలిమానుల దుండగమ్ములకు లోఁగి
నామ మాత్రావ శేష మైనది గదన్న!

ఈ శిలాభోగమహిమ జీర్ణించి చెదఱె,
ఈ కళా వైభవమ్ము నశించిపోయి,
ఈ నగర భాగ్యరమ తిరోధాన మంది,
యేల మిగిలెనొ నేఁడు దీపాలదిన్నె!

చెదఱి జీర్ణించి కూలి నశింప మిగిలి
రూపు గోల్పడనట్టి యీ స్తూప కృతులు
ఉన్న వొకకొన్ని 'మద్రాసు మ్యూజియము'నఁ
గళల కెదమెచ్చు ప్రభువుల చలువ కలిమి.

కృష్ణాతరంగ సంగీత విభ్రమములో
　　　వినుపింపదే మాంధ్ర విభుల చరిత ?
జీర్ణించియున్న యీ చిన్ని రెండూళ్ళలో
　　　పొటమ దేమీ ధాన్యకటక మహిమ ?
ఏపారియున్న యీ దీపాలదిన్నెలో
　　　దరిసెనం బీదేమి ధర్మరాజు ?
పూర్వాంధ్రలక్ష్మి దోబూచు లాడిన వీట
　　　కులుకవేమి నేఁడు తెలుఁగుసిరులు ?
మతవిరోధుల ఘోర కర్మములకతన
కాలపురుషుని పటు దురాగ్రహమువలన
పాడుపడిపోయె నా నాఁటి బౌద్ధమహిమ!
అస్తమించిన దా నాఁటి యాంధ్రభూతి.

గౌతమీసుత శాతకర్ణి ప్రతాపంబు
　　　కసి మసంగదు శత్రుగణము నేఁడు
పులమావి వాసిష్ఠిపుత్రు బాహాశక్తి
　　　వహియింప దాంధ్ర భూభరము నేఁడు
శాలివాహన కవి చక్రవర్తి కవిత్వ
　　　రసము లూరవు తెల్గువసుధ నేఁడు
ఆ మహాదేవ బౌద్ధాచార్య మతబోధ
　　　విస్తరిల్లదు తెల్గువీట నేఁడు
శిల్పి నాగార్జు నాచార్య సిద్ధ వర్యు
శిల్ప వైద్యక యోగాది సిద్ధులన్ని
వెలయ వీ నాఁడు బౌద్ధ విద్వేషవహ్ని
ప్రబలుటం జేసి యాంధ్ర ప్రపంచమందు.

ధాన్యకటక పురీ సభ్యతా విభూతి
కడుపులో జీర్ణమగుడు నాఁకటికి డస్సి
విలపన మొనర్చు నీ కృష్ణవేణి యిపుడు
తొంటి పస చెడ్డ సోదరాంధ్రులను గలసి.

బుద్ధుఁ డమరేశ్వరుం డెట్టి పొరపు లేక
యైకమత్యము సుఖ శాంతు లతిశయిల్ల
జనత యొనరించు పూజ లందిన దినములు
కలవఁటే కొన్ని సుమధుర క్షణము లవ్వి!

అప్పుడు బౌద్ధ హైందవ జనావళి చేతులు గల్పి శాంతిలో
నొప్పుల దోఁగి సభ్యుల నుతుల్గొని దేశ వివృద్ధికోసమై
యప్పన చేసినా రఁట నిజాఖిల సంపదలన్ దృఢంబుగాఁ
జెప్పెడు నాఁటి వైభవము చిత్త మిగుర్పఁగ శాసనాంకముల్.

అది బౌద్ధప్రళయమ్ముగా జనులు వ్యాఖ్యానింపుచున్నారు, నే
నది శిల్పప్రళయమ్ముగాఁ దలఁతు, సత్యం బిద్ది; కాదేని నె
మ్మది కానందము గూర్చు శిల్పకృతు లమ్మాడ్కిన్ వృథాపుత్తురా
యెద నూహింపఁడు బౌద్ధవైరము కళల్ హింసింపఁ జాలునే!

మత విద్వేష పిశాచ మావహిలి దుర్మానంబు పాటించి యే
వెతలం బెట్టిన బౌద్ధజాతిని, గళా విధ్వంసకుల్ గానిచో
శ్రుతివాదుల్ మన యాంధ్రసంతతికి మెచ్చుం గూర్పరే యేటికీ
గతి విద్వజ్జన గర్హ్యకార్యములు శంకాదూరులై చేయుటల్.

మత వైరమ్ము లోకప్డు కాలవశతం బాటిల్లు గా కైనను
ద్ధతులై జాతికి జీవగఱ్ఱ లగు గ్రంథశ్రేణులఁ శిల్ప స
త్కృతులఁ నాశ మొనర్తురా! మనుజులఁ హింసింతురా! యిట్టిదు
ష్కృతముల్ రూపటి దేశమెల్లెడ సుఖశ్రీ శాంతు లోలాడుతఁ!

## అ మ రే శ్వ రా ల య ము

ఈ యమరేశ్వరాలయ మ దే సుముహూర్తమునం బ్రతిష్ఠితం
బై యెసలారెనో యెఱుఁగ మప్పటినుండియు నాంధ్రధారణీ
నాయక గౌరవాదృతు లనారత మందుచు నీ ధరాప్రజా
ధ్యేయత భక్తకోటి కొక దివ్య మహాస్థలమై చెలంగెడున్.

ఆ కోటకేత రాజాగ్రణి గై సేయు
శిల్ప నిర్మితిఁ గళాశ్రీ గడించి
అల కొండవీటి ధరాధినేతల మేలి
సేవలలోఁ గ్రొత్తచెలువ మొలికి
శ్రీ కృష్ణరాయ ధరిత్రీ ధవుని చేతి
యపరంజిపూల సమర్చ లంది
మా వాసిరెడ్డి క్షమానాయకుని పున
ర్నిర్మాణ కళల వన్నియలు గ్రక్కి
తెలుఁగు దేశమునందు వర్ధిల్లినట్టి
యంచితంబగు నారామ పంచకమున
నొకటిగాఁ బేరు గాంచె సుప్రకట మైన
శ్రీమ దమరేశ్వరాలయ క్షేత్ర మవని.

అది యొకప్పుడు బౌద్ధదేవాలయ మఁట ;
ఇప్పు డమరేశ్వరస్వామి కిరవు సూవె;
అగపడుచునుండు బౌద్ధచిహ్నములు గుడిని
వెదకి చూడ పురాతత్త్వ విదుల కిపుడు.

  

ఓ యమరేశ ! తావక మహోగ్ర లయోద్ధుర తాండవంబులో
నీ యమరావతీ విభవ మెల్లఁ బదాహతిఁ బాడొనర్చితే ,
మాయమొనర్చితే భువనమాన్య మహాంధ్ర కళేందిరా పద
చ్ఛాయలు సైత మే యఘము సల్పిరి మా తెలుఁగుల్ జగత్ప్రభూ!

కరుణాసాంద్రుఁడ వీవు, బుద్ధగురుడుం గారుణ్య పాథోధి-మీ
పరమస్నేహము తెల్గుదేశమున కాపాదించె నైశ్వర్యముల్ ;
మఱల న్నేఁడు పురాణ హైందవ కళా లక్ష్మీ విలాసోన్నతుల్
మెఱయింపం గయికల్పుఁ డిర్వురును స్వామీ! మానమస్కారముల్.

—o—

## వివరణములు

పుటలు :

35. విశ్వకర్మ, మయుఁడు, త్వష్ట, మనువు - వైదిక పౌరాణిక వాఙ్మయములో ప్రసిద్ధి గన్న శిల్పప్రవర్తకులగు ఋషులు, బ్రహ్మలు.

40. పంచవిధాదిమ శక్తులు : ఆదిశక్తి, పరాశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి.

41. పంచ కల్యాణములు : బుద్ధోదయము, మహాభి నిష్క్రమణము, మార ప్రధ్వంసనము - లేక, సంబోధి; ధర్మచక్ర ప్రవర్తనము, మహాపరి నిర్వాణము.

52. శాలివాహనుఁడు కుంభకార కులమువాఁడను లోకప్రసిద్ధి యను సరింపఁబడినది.

54. నాగార్జునుని కొండకు శ్రీగిరి యనియు చరిత్ర ప్రసిద్ధి గలదు.

59. మహాయానబౌద్ధులు పవిత్రములుగా భావించు "నవధర్మములు" అను బౌద్ధగ్రంథములు:-గంత వ్యూహము, అష్టాసాహస్రిక, ప్రజ్ఞాపారమిత, దశభూమీశ్వర, సమాధిరాజ, లంకావతార, సద్ధర్మపుండరీక, లలిత విస్తర, సువర్ణ ప్రభాసములు.

60. సుధన్వ మహారాజు సభలో కుమారిలభట్టు బౌద్ధుల నోడించి నశింపజేసె నన్న గాథ సంస్కృతములోని "శంకర విజయము" నుండి గ్రహింపఁ బడినది.

68. ఆరామపంచకము : అమరారామము. క్షీరారామము. దాక్షారామము. భీమారామము. కుమారారామము.

వైదికులు : వేదమతానుసారు లగు హైందవులు. పంచార్షేయులు : సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణులనెడి వేదప్రసిద్ధ పంచబ్రహ్మ ఋషుల వంశమునఁ బుట్టిన విశ్వబ్రాహ్మణులు, లేక శిల్పబ్రాహ్మణులు.

## గ్రంథముద్రణకు సహకరించిన ఉదారులు

—o—

శ్రీ తుమ్మనపల్లి లింగయ్య పురుషోత్తం బ్రదర్సు.
జగిత్యాల రు. 600

శ్రీ ముదికిపూడి సూర్యకోటీశ్వరరావుగారు
7/509, రాజుపేట మచిలీపట్నం. రు. 116

శ్రీ పావులూరి వెంకయ్యచౌదరి బుల్లెమ్మగారలస్మారకార్థం
శ్రీ ఉప్పల శ్రీమన్నారాయణ వసుంధరాదేవిగారలు.
గోవాడ. రు. 116

శ్రీ కాసర్ల మాధవాచార్యులుగారు 15-1-590
సిద్ధింబర్ బజారు, నారాయణగూడ, హైదరాబాద్. రు. 58

## శ్రీ వీరరాఘవ గ్రంథావళి

—o—

1. యోగదర్శనము. రు. 15—00
2. శిల్పదర్శనము. ,, 12—00
3. వీరరాఘవ వ్యాసావళి. ,, 12—00
4. మిత్రసాహస్రి. ,, 12—00
(నీతి వేదాంత ప్రతిపాదకములైన ఆటవెలదులు)
5. లేపాక్షి (చారిత్రక నవల) ,, 6—00
6. మోహనాంగి ,, ,, 7—00
7. మనగురుదేవుడు (బ్రహ్మంగారి సంగ్రహచరిత్ర) ,, 5—00

# పునర్ముద్రణము కావలసినవి

—o—

1. ఆత్మదర్శనము (తత్త్వశాస్త్రము)
2. తోరణము (ఖండకావ్యము)
3. శిల్పకళా క్షేత్రములు (1,2, భాగములు)
4. మూడు కావ్యాలు (రామాయణ, భారత, భాగవతముల సమీక్ష)
5. కళారాధన (జక్కణాచార్య చరిత్ర-నవల)
6. నిరంజన విజయము (కీ. శే. వ. నిరంజనశాస్త్రిగారి జీవితము)
7. ఆసియాజ్యోతులు (బుద్ధ, క్రీస్తు, మహమ్మదు, మహాత్ముల జీవితములు)
8. వీరబ్రహ్మ సుప్రభాతమ్.
9. విశ్వకర్మాష్టకమ్.

—o—

## సవరణలు

| పుట. | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 3 | 7 | శిల్పకాళాభిరతీ | శిల్పకళాభిరతీ |
| 9 | 5 | విశ్వవిద్యాలయములు | విశ్వవిద్యాలయములు |
| 22 | 5 | తెలుఁగుసంస్కతి | తెలుఁగుసంస్కృతి |
| 42 | 6 | బుద్ధిత్వసిద్ధ | బుద్ధత్వసిద్ధి |

—o—